# మల్లె మొగ్గ

డంబు మీఱఁగ మాఘమా ♦ సంబునందు
మొక్కవేయఁగఁ దఱి యని ♦ పూన్కితోడ
నతిముదంబున నొకమల్లె ♦ యంటుదెచ్చి
యెలమి మొక్కకు నిరవైన ♦ బిలముత్రవ్వి
దాని కింపుగఁ దగుదోహ ♦ దంబుఁజేసి
పళ్లెరముభాతిఁ జుట్టుఁ గై ♦ వారమునిచి
నీరజాప్తుఁడు చరమాద్రిఁ ♦ జేరువేళ
పక్షులెల్లను గూళ్లకుఁ ♦ బాఱువేళ
పిల్లవాయువు లల్లన ♦ వెడలువేళ
ప్రాతిపెట్టెను నొకలేమ ♦ భద్రముగను
నీళ్లు పోసెను మెల్ల దో ♦ సిళ్లతోడ
నెలమి నాచిన్ని మొక్కని ♦ పిలువఁదొడఁగెఁ
బ్రాణమంతయు దానిపై ♦ వైచియుంచెఁ

బలువిధంబుల యోచన ♦ లెన్నుచుండెఁ
గటికిచీఁకటు లెల్లెడఁ ♦ గ్రమ్మియుండెఁ
బ్రొద్దుపోయినసంగతి ♦ బొత్తిగాను
గానకుండెను దానిపై ♦ ధ్యాన మునిచి
నేఁడు 'పరిమళ' యింకను ♦ నిలయమేల
చేరకుండెనో తెలియదు ♦ కారణంబు
అంచు వగచుచుఁ దల్లి తా ♦ నతిరయమున
నిరుగుపొరుగులవారల ♦ యిండ్ల కేఁగి
యమ్మలక్కల నందఱి ♦ నడుగసాగె
నేమొ యీవేళ నామెను ♦ నెఱుఁగ మంచు
సరవి వారెల్లఁ జెప్పగాఁ ♦ జంద్రికళకుఁ
జింత యొదవెను నెమ్మోము ♦ చిన్నవోయెఁ
గలికికన్నీరు మున్నీరు ♦ గాఁగఁ బాఱె
నలయఁ గ్రొవ్వేఁడినిట్టూరు ♦ పులు చెలంగె
వేఱుత్రోవను నింటికి ♦ వెడలెనేమొ
యంచు జనయిత్రి యింటికి ♦ నరుగుచుండ

రమణి పరిమళ యనతిదూ ♦ రంబులోనఁ
దల్లిరాకనుగాంచి సం ♦ తసముతోఁ బ
నమ్మరో! యిప్పు డేడకు ♦ నరిగి తనుచు
ముద్దుమాటలఁ దల్లిపై ♦ మోపి నెపము
మందహాసంబుతోఁ దన ♦ మాత కెదుట
నోయి యాలింగనమ్మును ♦ జేయనపుడు
తల్లి హర్షంబునకును సం ♦ తంబు గలదె?
తల్లి వికసితవదనయై ♦ తనరుచుండె;
చిలుకపలుకులఁ గథనెల్లఁ ♦ జెలువ చెప్పె;
పిల్ల చెప్పినకథ నెల్లఁ ♦ దల్లి వినుచు
స్మితము మోమునఁ జెలఁగ న♦చ్చెరువుఁ జెందె
రేయి యాతయుఁ బరిమళ ♦ హృదయ మెల్ల
ముక్కపైఁ బెట్టి ధ్యానింప ♦ మొదలు పెట్టె;
కమలమిత్రోదయంబున ♦ కన్న ముందె
మునసి చీఁకటు లెల్లను ♦ బోకముందె
ముక్కడగ్గఱ కరిగెను ♦ ముదముతోడ

# మల్లెమొగ్గ.

నీళ్లు పోసెను చేర్మి దో ♦ సిళ్లతోడఁ
జెలిమికత్తెలఁ గొంపోయి ♦ యెలమి నటకు
నాటపాటల నయ్యెడ ♦ నాడుచుండె
మొక్క మూఁడవదినమందు ♦ మోము వాఁచి
వాఁడినది కొంచె మప్పు డా ♦ బాల చూచి
మొగము వాలిచి మిక్కిలి ♦ వగవఁదొడఁగెఁ
గన్నుఁగవ వేఁడి బాష్పము ♦ ల్కాల్వగట్టె
ఘనజవంబునఁ దనతల్లి ♦ కడకు నేగి
పొనరఁ దనతల్లి మోమున ♦ మోముఁ జేర్చి
చెప్పఁ దొడఁగెను వింతగాఁ ♦ జిత్రిమెల్లఁ
దనయ చెప్పినదంతయుఁ ♦ దల్లి వినియుఁ
తల్లి? యని ముద్దుబిడ్డని ♦ దరికిఁ దీసి
పూని ప్రియభాషణమ్ముల ♦ బుజ్జగించి
"యింతదానికి నీవు చిం ♦ తింపకమ్మ
వేఁడి నిట్టూర్పు దీనికై ♦ విడువకమ్మ
పొలతి యీవేళ నీళ్లను ♦ బోయకమ్మ

యువనిఁకో నన్ని మొక్కల ♦ కదిస్వభావ
మెల్లి ప్రొద్దున నిద్దాని ♦ యింపుఁ గనుము"
అంచు ముద్దాసి యాబాల ♦ ననిపెఁ దల్లి.
తనయ యాదినమెల్ల ఖే ♦ దమున నుండెఁ
బంచమాహ్నంబునందునఁ ♦ బల్లవంబు
లంకురింపఁగఁదొడఁగిన ♦ నతివ చూచి
మొక్క బ్రతికె నటంచును ♦ ముదముఁ జెందెఁ;
అంతఁ గ్రమముగఁ దీవియు ♦ లలముకొనుచు
జొంపములుగాఁగఁ బెరిగెను ♦ సొంపుమీఱ
రెమ్మలెల్లను నిగనిగ ♦ లీనఁదొడఁగెఁ
జెలువ యేప్రొద్దు నచటికి ♦ నరుగుచుండెఁ;
అంతఁ గ్రమముగ శిశిరర్తు ♦ వంతమొందె
సలరెఁ బుడమిని శ్రీవసం ♦ తాగమంబు
లలితతరుగుల్మనవలతా ♦ వళులు వేడ్కఁ
గోమలములైన చిగురులఁ ♦ గూడుచుండె
నాలుమగలెల్ల సంతస ♦ మందుచుండి;

చూతకిసలయజాలమ్ము ♦ మేఁత మేసి
గండుఁగోయిల లెల్లను ♦ దండిమీఱఁ
బంచమస్వరమున లెస్స ♦ బాడఁదొడఁగెఁ
బ్రసవరసమత్తభృంగాళి ♦ రవము హెచ్చె
వరుసఁ బుష్పించె నుద్యాన ♦ వనము లెల్ల
మలయమారుతపోతము ♦ లమ్రసలఁదొడఁగె
హాయిఁ గూర్చుచు నున్నవి ♦ యవనిలోనఁ
బండు వెన్నెలప్రభలును ♦ బ్రబలుచుండె
వెన్నెలలలోన మొక్కలు ♦ పెరుగు లెస్స
మగువ పరిమళ ప్రాప్తిన ♦ మల్లెయుంటు
మొనసి చిగిరిచి క్రమముగా ♦ మొగ్గలెత్తెఁ
దనరుచున్నట్టిపద్రింపుఁ ♦ దునక లనఁగ
లలితమైనట్టిముక్తాఘ ♦ లంబు లనఁగ;
వానిసొగసును దిలకించి ♦ పరిమళయును
నతులమైనట్టియానంద ♦ మందుచుండె
పరవి వికసిల్లెఁ బూర్ణిమా ♦ చంద్రుమాడిక్క

వాని యాకృతి నెల నా ◆ బాల చూచి
ప్రమద మొందుచుఁ దనతల్లి ◆ పజ్జ కేగి
ముద్దుపలుకులఁ బలుకుచుఁ ◆ బొంతఁ జేరిఁ
సరవి మల్లిక పూచిన ◆ చరితమాత
పూసగుచ్చినమాదిరి ◆ ముచ్చటించి
అమ్మ! చూడవె నామల్లె ◆ యంటు నంచుఁ
గోకచిఱచెంగు లాగుచుఁ ◆ గూర్మితోడ
ముద్దులొలికెడిగారాబు ◆ మోముతోడ
పిల్లనడకలనాబాల ◆ వెడల ముందు
బిడ్డముగ్గును దీర్పఁగఁ ◆ బ్రేమతోడఁ
దల్లి వెంటాడె మందస్మి ◆ తంబుతోడ
అప్పు డాబిడ్డ చూపిన ◆ యరుఁగుమీఁదఁ
గూఁతుపట్టును జెల్లింపఁ ◆ గూరుచుండఁ
దనయ నగుమోము వర్ణింపఁ ◆ దనివి యగునె?
తనరు మొగ్గలెసారును ◆ దల్లిచూచి
చారుతరపుష్పసాయక ◆ సాయకములె

## మల్లెమొగ్గ.

యంచుఁ దలపోసి వానిసో ♦ యగముఁ గాంచి
బిడ్డమొగ్గలసంగతి ♦ వివిధగతులఁ
బూని వర్ణింప జనయిత్రి ♦ మోమునందు
స్మితవిలాసంబు లుదయించెఁ ♦ జెన్నుమీఱ
నొసర గాదిలిబిడ్డను ♦ నొడిని జేర్చి
యెలమి నీ మొక్కఁ బెనుప నీ ♦ కెల్లు తెలిసె
నిపుణురాలవు మిక్కిలి ♦ నీతిమతివి
యంచు మృదుభాషణంబుల ♦ నామె ప్రేమ
సలదుఁ జెక్కిలి నొక్క ము ♦ ద్దాడియాడి
శిరము మూర్కొని చిఱునవ్వు ♦ చెలువుతోడ
వింతపలుకుల బిడ్డకు ♦ విందొనర్చి
తల్లి హర్షముతో నుండెఁ ♦ దనయఁగూర్చి.
పసిడిచేలంబు లున్నసం ♦ తసముకంటె
రత్నవస్తువు లున్నహ ♦ ర్షమునకంటె
నెలమిసుత యాడునొకపల్కు ♦ విలువగాదె
అతుల మైనట్టిసంతస ♦ మదియె యిచ్చు

ననుఁగుబందుగు లెందఱో ♦ యలరుచున్న
నెలమి సుతయిచ్చునానంద ♦ మీఁయఁగలరె?
యిచ్చకపుమాటలెల్లను ♦ నెలమి బిడ్డ
పలుకుకంటెను నుబ్బింపఁ ♦ గలవె యిలను
పిల్లపలుకులఁ దనమది ♦ పల్లవింప
శిరము మూర్కొని జనని తాఁ ♦ జెక్కు నొక్కి
యొగిని ముద్దాడి చెఁగున ♦ నున్నరూక
విప్పి తనబిడ్డచేతికి ♦ వేడ్క నిచ్చి
పాలుమీఁగడ లీవేళఁ ♦ బట్టి నీకు
నిడుదు సంచును నరిగెను ♦ నింటి కామె.
అంతఁ బరిమళ మరునాఁడు ♦ హర్ష మెసఁగ
గమగమ యటంచు వాసనల్ ♦ గ్రిమ్ముచున్న
మల్లెపాదఁ జేరి మొగ్గలు ♦ మెల్లఁ గోసి
దండగాఁ గూర్చి తనతల్లి ♦ దఱికి నేగి
కేల నాదండఁ బైకెత్తి ♦ లీలతోడ
వాణిముత్యాలపేరుల ♦ నపహసించి

కప్పురపుదండ నిరసించి ♦ గ్రాలునట్టి
దమ్మ యీదండ నెవ్వారి ♦ కమ్మ యిదుదు
పలుకు మమ్మరో యని పరి ♦ మళవచింప
"దేశభాషాభివృద్ధియే ♦ దివ్యమైన
పుణ్యకార్యంబటంచును ♦ బూన్కితోడ
పరవి జ్ఞానాభివృద్ధికై ♦ జతన మెపుడు
సలుపుచును జెన్నుమీఱఁగ ♦ శాశ్వతముగ
వాసిమీఱు శ్రీరామవి ♦ లాస మనెడి
గ్రంథనిలయమ్ము నకు నీవు ♦ కాన్కనిమ్ము
ఈశ్వరుఁ డొసంగునెపుడు నీ ♦ యీప్సితముల
నిహపరసుఖంబు లెల్లను ♦ నెలమినిచ్చు"
అనివచింపఁగ నామాట ♦ లన్నియు విని
అమ్మరో యెల్లసుఖముల ♦ కాకరమగు
నాదుహృదయంబు ధ్రువముగా ♦ నీదెకాదె
తనయుడై పుట్టి భువిలోనఁ ♦ దల్లిఋణముఁ
దీర్ప స్వర్గంబు; హర్షించు ♦ దేవుఁడంచు

వినయ ముప్పొంగ నాదండ ♦ వేడ్కతోడ
గ్రంథనిలయమ్మునకును న ♦ ర్పణముఁ జేసి
ఘనత మీఱంగఁ బరిమళ ♦ యనెడిబాల
తల్లికోరికఁ దీర్చి తా ♦ ధన్య యయ్యె.



---

N. B.—ఒకస్నేహితుని ప్రేరపణచే నప్పటికప్పుడు చెప్పినది.

